లేక మజ్జిగతో పిడకబూడిదను కలిపి రాయాలి.

లేక వంటఆముదము సవాశేరు, రాతి తడిసున్నం పదితులాలు, నీరు మానెడు కలిపి చేతితో గిలకొట్టగావచ్చిన వెన్నవంటి పదార్థాన్ని కూడ నవనీతమంటారు: దీనినికూడ వాడవచ్చును.

లేక ఫార్మసీవారి గ్లయిమాల్‌ను రాయాలి.

## గజ్జి

ఇది పశువులకు ఒకవిధమగు సూక్ష్మజీవులవలన రాగలదు. ఈ పురుగులను "పారసైట్" జీవు లంటారు. ఇవి చర్మభాగంలో వుండే రోగపదార్థాన్ని తింటూ లోపల గుడ్లు పెట్టి పొదుగుతాయి. ఇది వేడి పదార్థముగావుండి దురద, గుల హెచ్చుగా వుంటుంది. ఈగజ్జి మెత్తని భాగానికి ఎక్కువగా సోకుతుంది. ఈరోగము పెద్దపశువులకు, బల హీనంగా వుండే మగపశువులకు ఎక్కువగా వుంటుంది. ఈగజ్జినే చర్మ నుసిమిరి అంటారు. మూపురంమీద మెడభాగమందు, వెన్నుభాగ మందు, ప్రక్కఎముకల చర్మముమీద నలుపురంగుగా గాని, పసిమి రంగుగా గాని యుండి దురద కలిగినప్పుడెల్ల గోడలకు చెట్లులకు వేసి రుద్దుకొంటుంది. వ్యాధి ముదిరిన తగ్గుట కష్టము.

## చికిత్స

గంధకము 1తు, మైలతుత్తం 1/4తు, వ్యాసులైను 8తులాలు కలిపి అప్పుడప్పుడు రాయాలి.

లేక సన్నని గోనెపట్టాతునకను మాడ్చి ఆముదములో కలిపి రాయాలి. లేక ఫార్మసీవారి కీటారి అత్యద్భుతంగా పనిచేస్తుంది.

## గజచర్మరోగము

ఈవ్యాధి పేనుసంబంధమైనట్టి బూజుసంబంధమైనట్టి, సూక్ష్మ జీవులవలన పశువులకు కలుగుతుంది. ఇది ఉష్ణరోగపదార్థ మండలము

వలన ఉత్పత్తి యగుతుంది. మొదట పశువు శరీరమునం దక్కడక్కడ ఈనుసిమిరి పుట్టి క్రమేపి వృద్ధియగుతుంది. పశువునకు ఎక్కువగా దురద, మంటపుట్టి అప్పుడప్పుడు తన పండ్లతో గీకుకొంటుంది. బొబ్బలుకూడ పుట్టవచ్చును. క్రమముగ నల్లమచ్చలుగా మారి అవి గ్రుడ్లుపోసి పలుచని ద్రవాన్ని స్రవింపజేస్తుంది. వెంట్రుకలు రాలి పోతాయి. ఈ వ్యాధి గిత్తలకు తరచుగా వస్తుంది. పశువుఅప్పుడప్పుడు నుసిమిరియున్నచోట గోడలకు, గుంజలకు, కట్టుగొయ్యకు వేసి రుద్దు కొంటుంది. పశువు ఆకారముచెడి క్షీణించి కాంతి తగ్గుతుంది. ఈ వ్యాధి ముదిరినచో తగ్గుట చాల కష్టము.

## చికిత్స

సైంధవ లవణము కలబందమట్ట రసముతో కలిపి రాయాలి.

మేక వదరు వేడిమైనది తీసికొనివచ్చి శరీరమునకు మూడు నాలుగు పూతలుపెట్టి తరువాత వేడినీటితో కడగాలి.

2 తులాలు పసుపు, అర్ధశేరు ఆవుపాలతో కలిపి ఒకపూట త్రాగించిన తరువాత అడ్డసరపు విత్తులు, నువ్వులు, ఉప్పు, కొట్టుపసుపు, వెఱ్ఱిపుచ్చవేళ్ళు, బావంచాలు, జిల్లేడు మొగ్గలు ఒక్కొక్కటి తులము వంతున తీసికొనివచ్చి మెత్తగానూరి వేపనూనెతో కలిపి నుసి మిరియున్నచోట రాయాలి. మూడవనాడు మేకపొట్టలో నుండు వెచ్చని వదరు రుద్ది నాల్గవనాడు వేడినీటితో శరీరమంతయు కడుగాలి శరీరమంతా వ్యాపించి మచ్చలుపడి బాధజెందు నుసిమరి తగ్గుట చాలకష్టము. కీటారిని వాడుడు లేం పాలతో ఇంజెక్షను చేయించాలి.

## పశువుదేహము ఉడుకెత్తుట

పశువును అతి తీవ్రమైన ఎండలో పని చేయించుట వలన ఆ సమయములోనే దాహమెక్కువై శరీరము వుడుకెత్తి యుండు వలన చన్నీళ్ళతో దేహముకడుగుటవలన జ్వరముసోకు టవలన ఎండ

పనిచేయించుటవలన వ్యాధి కలుగుతుంది. పశువు ఎండలో వుండక వగర్చుతూ నీడకు పోతూ నీటిలో కూడ పడుతుంది. దేహమంతా మంట లెక్కుతుంది.

## చికిత్స

నూరేకారము 2 తులములు నీటిలో కలిపి త్రాగించాలి.

చన్నీటిలో గుడ్డముంచి తలకు కొట్టాలి.

శరీరముపైనకూడ చన్నీటి కాపులు తీయాలి. లేక పాన్‌టాల్ వాడాలి.

## వెంట్రుక లూడిపోవుట

పశువునకు పెద్దరోగము, జ్వరము, గాలికుంటు మొదలగు రోగాలు తగిలి నెమ్మదించిన తరువాత పశువు ఈనిన తరువాత లేత దూడలకు దుర్భలత్వముచేత వెంట్రుకలు వూడిపోవుట తటస్థించుతాయి. పొట్టి వెంట్రుకలు కత్తిరించాలి.

లేక వ్యాసులైనుతో నీలిమందు తగినంత కలిపి రాయాలి.

లేక మునాంబ్రము ఘాటు సారాయిలో కలిపి రాయాలి.

లేక వెల్లుల్లిపాయలపొట్టు కాల్చి నీమనూనెలో కలిపిరాయాలి.

## గోమారులు బుడ్డపుంజులు

ఈ గోమారులు కాలబుతువులనుబట్టి పుట్టుతూ మరల వాటంతటవే పోతూవుంటాయి. కాని యివి పశువును పట్టుకొని నెత్తురును పీల్చుటచేత పశువు దుర్భలత్వముచెంది పలువిధ సంకటముల పాలగుతుంది. కాబట్టి వెంటనే వీటికితగు చికిత్సచేయాలి. గోమారులు బహు మొండిజాతి. వీటికి పశువు శరీరమును తొలుచుకొని పోవునంతటి శక్తివుంది. ఈ గోమారులున్న పశువును చూచిన మనకు

చాల అసహ్యాంగా వుంటుంది. ఈ గోమారులవల్ల రక్తమూత్రం అనే వ్యాధి సోకునని ఇదివరకే ఈగ్రంథములో చెప్పియుంటిమి. పశువు పొదుగుమీదను, కాళ్ళమీదను, కండ్ల రెప్పలమీదను వీలులేని స్థలములమీదను పట్టి బాధించుతాయి.

## చికిత్స

ఫినైల్ అర్థసేరు, ఫ్రెంచి వార్నిషు పావుసేరు, కార్బాలిక్ 1తు, గంధకపుపొడి 4తు, వేడినీరు సేరు కలిపి దీనిని గుడ్డతో ముంచి రాయాలి.

లేక మంచినూనె దేహమంతటికి రాచి ఎండలో వుంచితే చావవుగాని ఊడిపోతాయి. కాబట్టి ఈ చికిత్స చేయు పశువును దూరముగా ప్రత్యేకస్థల మందుంచి చికిత్సచేయాలి. లేక ఫార్మసీవారి కందూ్రితను వాడాలి.

## హెచ్చరిక

గోమారు లున్న కొట్టాలలో పశువు నుంచి చిన్న మంట వేస్తారు. ఇదిచాల ప్రమాదకరమైన విషయము. నేను ఈ గోమారుల వలన తగులబడిన కొట్టములను ప్రత్యేకముగా చూచియున్నాను. కాబట్టి ఇటువంటి ప్రమాదకరమైన పనులు చేయుటచేత కొన్ని పశువులు కూడ మరణిస్తాయి.

## తోకనుసిమిరి

పేడ మన్ను మొదలగు కల్మష పదార్థాలు పశువు తోకకు అంటుకొని యుండుట చేతను రైతులు వానిని పరిశుభ్రముగా గడుగక పోవుట చేతను ఈ వ్యాధి కలుగుతుంది. ఒకవిధమైన బూజు సంబంధమైన సూక్ష్మజీవులు తోకలోపలిభాగమున ప్రవేశించి దురద పుట్టించుతుంది. తోక నల్లబడి వెంట్రుకలు వూడిపోతాయి. ఈవ్యాధి పశువు

తోకకుచ్చుకు పైభాగానేయుంటుంది. ఇది యెక్కువగా వ్యాపించితే పశువుతోక సరిగా నెత్తలేట కుచ్చుతో నటునిటు విసరుకొంటుంది.

## చికిత్స

మైలతుత్తము పావుతులము, గంధకము 1 తు, వస 1 తు, వ్యాసులైను 2 తు కలిపి నుసిమిరికి రుద్దాలి.

లేక ఒకవంటపిడక తెచ్చి తోకపైనున్న నుసిమిరిపై ఎట్టబడు నటు రుద్దాలి. తరువాత దానిపైన పసుపు మాగడ కలిపి రాయాలి. ఇట్లు రెండు మూడు దినములు చేసిన నెమ్మది యగుతుంది.

పసుపు నల్లేరుతో కలిపి బాగుగా రుద్దాలి.

విషబొద్ది కొబ్బరినూనెలో కలిపి రుద్దాలి.

వెన్నతో ముర్దారుసింగు కలిపి రుద్దాలి.

ఆముదపు పలుకులు సూరేకారము ఉప్పు మెత్తగా నూరి పెరుగుతో కలిపి రాయాలి. ఫార్మసీవారి కీటారి చక్కగా పనిచేస్తుంది.

## పొడలు - మచ్చలు

పసువు శరీరముమీద గుబురు గుబురుగా ఒకవిధముగ మచ్చ లేర్పడుతాయి. కాని వీనివలన ప్రమాదముండదు. పశువు ఆకారము చెడుతుంది. వాటంతటవి పుడుతుంటాయి. ఇవి చలిగాలి సోకగనే పోతుంటాయి.

## చికిత్స

విభూతి, పుల్లమజ్జిగ కలిపి నాలుగైదు దినములు రాయాలి. మజ్జిగలో పిడక బూడిద కలిపి రాయాలి. ఆవనూనెలో వెల్లుల్లిపాయలు వేసికాచి రాయాలి. వేపాకు కాల్చినబూడిదలో నెయ్యికలిపిరాయాలి. రావిచెక్కబూడిద కొత్తతడిసున్నముతో కలిపి రాయాలి.

లేక హిలాన్‌ను వాడాలి.

## జోరీగలు

జోరీగలు పశువుకడుపు అడుగుభాగాన తదితర భాగములు లందు వందలకొలది వేసవికాలపు చివరదినాలలో ఎక్కువగా కాన్పించుతాయి. జోరీగ పిల్లలను పశువుమ్రింగినపుడు గుండుసూది పరిమాణము గలిగి యుంటాయి. కాని రెండు నెలలపిమ్మట యవి జూన్ జులైవరకు లోపల యుండి తరువాత మలముతోపాటు బైటకి వస్తాయి.



ఈపురుగులు కడుపు లోపలిభాగమునుండి యేమైన హాని చేయ నిదీ లేనిదీ పశువైద్యులేమియు చెప్పజాలరు. పశువుశరీరము వెలుపల నివసించే జోరీగలు చర్మముపైన గ్రుడ్లుపెట్టి సంతాన నభివృద్ధిని పెంపొందించుతాయి. పసువురక్తాన్ని పీల్చుతుంది. ఇవి ఎక్కువగా వుంటే పసువు క్రిమేపి క్షీణిస్తుంది. పసువునకు దురదపుట్టుతుంది. ఇవి అంటువ్యాధులను వ్యాపింపజేస్తాయి.

## చికిత్స

వీటికి కింతవరకు సరియైన చికిత్స లేదు.

ఫినైలు 1 భాగము నీరు 3 భాగములు కలిపి దేహమంతట రాయాలి. లేక కర్పూరతైలముగాని, తారుగాని ఆయా భాగములందు రాయాలి.

లేక కందుమ్రితును వాడాలి.

## దోమలు

పల్లపు ప్రదేశములలో, మురికి గుంటలలో ఇవి ఎక్కువగా వుంటాయి. వీటివల్లనే పశువులకు అనేక విధములైన వ్యాధులు ప్రబలుతాయి. కాబట్టి వీటి నిర్మూలమునకు తగిన చికిత్సచేయాలి. దోమలు పశువులకు మిక్కిలి హానిని కలిగించు శత్రువులు. కొన్ని దోమలు విషకరమైన కాటుగలవి. ఏనుగుకాలు అనువ్యాధి వీటివల్లనే కలుగుతుంది. కాని వానిని పరీక్ష చేయుట కష్టము. కనుక అన్ని దోమలును విషము గలవని తలంచి జాగ్రత్త తీసికొనుట యుక్తము. ఈగలవలెనే దోమలకు 'జర్మపారంపర్య' మున్నది. మురుగుకాలువలు, బురద నేలను దోమలకు మిగుల యిష్టము. కుడితి తొట్లలోను, పగిలి పోయిన డబ్బాలలోను నీరునిలిచి యుండకుండ జూడాలి.

## చికిత్స

ఆవుపేడ కలిపిన చెత్తను తెచ్చి దానిలో గవ్వసాంబ్రాణి అమరశిలగంధకము కలిపి పొగవేసిన మరల నవి రాజాలవు. లేక దాల్చిన అరఖు లవంగాల అరఖు నీటిలో కలిపి చల్లిన దోమలు రావు. లేక భూతులసిచెట్లను కొట్టములలో కట్టిన రాజాలవు.

## పేలు

ఇవి మనుష్యుల తలలో వుండే పేలకంటె కొంచె మెక్కువ పరిమాణము కలిగి యుంటాయి. ఇవి కుట్టినచోట దద్దురుపుట్టి చర్మము వాచుతుంది. వాటిని తేలికగా చంపవచ్చును. కాని ఊపి తీసివేయుట కష్టము. కొబ్బరిచిప్పల కాల్చినచమురును పేలున్నచోట రాయాలి. లేక వెల్లుల్లిపాయల రసమును రాయాలి.

# మి న్న ల్లు లు

కొన్ని దూడలకు మిన్నల్లులుపట్టి బాధించుతాయి. వెంట్రుకలు రాలిపోయి పుండ్లుపడి దూడ నాకుకొంటుంది. యీ బాధ ఎక్కువైన కొలదీ దూడ చనిపోతుంది. ఇవి పాలదూడలకు తరచుగా పట్టుతూ వుంటాయి. మిన్నల్లులు చర్మమునందు రంధ్రమువేసి గ్రుడ్లుపెట్టి ఆ గ్రుడ్లు పిల్లలై చర్మముపై దురదను పుట్టించుతాయి. ఇవి రోగాలుగల పశువు రక్తమునుపీల్చి యితర పశువుల దేహములలో దీనిని విడుచుట వలన అంటువ్యాధులు కలుగుతాయి. ముందు దూడల బొచ్చు కత్తిరించాలి.

## చి కి త్స

ఫినైల్ 1 భాగము, నీరు 2 భాగములు కలిపి శరీరమునకు పట్టించాలి.

లేక వేపనూనె 1 భాగము, కిరసనాయిల్ 2 భాగములు కలిపి పట్టించిన వెంటనే తగ్గును.

లేక వేపాకు నీటిలోవేసి మరగకాచి ఆ నీటితో దూడను కడుగవలెను. లేక కంద్రుడూతును వాడాలి.

......(o)......

# నలుబదివ భాగము

## చట్కా చికిత్సలు

సంస్కృతం, తమిళ, హిందీ, యూనానీ, ఉర్దూ, ఒరియా, మరాఠీ, మలయాళ, తెలుగు గ్రంథాలను కొన్నిటిని సంపాదించి వాటిలోనున్న చికిత్సలను మా పశువైద్యశాలలలో పశువులకు వచ్చిన ఆ యా పశురోగాలకు నేను, నా విద్యార్థులు వాడిన కొన్ని ముఖ్యమైన చికిత్సలనే ఈ దిగువ తెలిపితిని.

## పెద్ద రోగము

వెదురాకు, నేలవేము, అడ్డసరపువేళ్ళు, నల్లేరువేళ్ళు, తెల్లావాలు సమాన భాగాలతో చేర్చి మూడుగొట్టాలతో రోజు కొక మోతాదువంతున వరుసగా రెండు దినములు ప్రథమావస్థలో పెట్టాలి.

లేక అత్తిపత్తి చెక్క 6 తులాలు, పెద్దలవంగపట్ట చెక్క 4 తులాలు, నల్లతుమ్మచెక్క 4 తులాలు, మెంతిపొడి 8 తులాలు తెచ్చి నూరి సేరు పులిమజ్జిగలో కలిపి త్రాగించాలి.

లేక మెంతిపొడి 4 తులాలు, జీలకర్ర 1 తులం, పసుపు 1 తు, ఇంగువ 1 తు, పులిచింతాకు 4 తులాలు, దానిమ్మ, అరటి పువ్వులు కొబ్బరిపువ్వులు కలిపి 5 తులాలు, మామిడి చిగుళ్ళు 2 తులాలు కలిపి మెత్తగా నూరి సేరు మజ్జిగలో కలిపి త్రాగించాలి.

లేక చేదు పుచ్చకాయలరసం పావుసేరు, నేరేడుచెక్క రసం అర్ధసేరు కలిపి త్రాగించుము.

లేక అరటి పువ్వులరసము పావుసేరు, సున్నపుతేట అర్ధసేరు కలిపి త్రాగించుము.

లేక పచ్చిదానిమ్మకాయలు - రెండు, కర్పూరం 1 తులం, తాటిబెల్లం 15 తులాలు కలిపి మెత్తగానూరి రెండు వుండలు చేసి పూటకొక మోతాదు ఈయాలి.

లేక చేదుపుచ్చకాయలు రెండు తీసికొని సేరు మేకపాలలో కలిపి త్రాగించుము.

లేక వేపాకులు పసుపు మెత్తగానూరి లోపలికి ఈయాలి.

లేక శొంఠి, వాము, నానువారిపాలు, మోదుగపువ్వు సమాన భాగాలు కలిపి కలిసీటితో త్రాగించాలి.

పైన చెప్పిన మోతాదులు పెద్దరోగము ప్రమాదవస్థలో ఒకటి రెండు మోతాదులు ఈయాలి.

## దొమ్మలు

కరక్కాయలు, ఉసరికపప్పు, శొంటి, పిప్పళ్ళు, మిరియాలు ఒక్కొక్కటి 3 తులాల పొడిని శేరుచింతపండు రసముతోగాని లేక గేదె పేడరసముతోగాని కలిపి వడపోసి రోగము తగ్గువరకు ప్రథమదశలో ప్రతి నాలుగుగంటలకొక మోతాదు ఈయవచ్చును. లేక ఉత్తరేణి సమూలరసమును మేకపాలతోగాని, మేకమూత్రముగాని త్రాగించాలి.

లేక కర్పూర శిలాజిత్తును మెత్తగానూరి మేక మూత్రముతో ఈయవచ్చును

లేక గంగరేగు ఆకులరసముగాని, చెక్కరసముగాని, నిమ్మ పులుసుతో కలిపి ఈయాలి.

లేక దుష్టుపాకు, ఏనుగతుమ్మఆకు, పసరులు పావుసేరు వంతున తీసికొని ఒకతులం కర్పూరం కలిపి ఈయాలి.

లేక నీరుల్లిపాయలు 3 తులాలు, తుంగముష్టి 2 తులాలు, దుష్టుపాకు 3 తులాలు, మారేడుపండు 3 తులాలు, వస 3 తులాలు తెచ్చి కలిపి మెత్తగా తగినంత నీటితోనూరి రెండు మోతాదులుగా మాత్రలుచేసి ఉదయ సాయంకాలము ఈయాలి.

లేక ఇంగువ 4 తులాలు, కర్పూరం 2 తులాలు తాటిబెల్లం 20 తులాలు కలిపి రెండు మాత్రలుగాచేసి ఉదయ సాయంకాలము ఈయాలి.

## జబ్బవాపు

వెల్లుల్లి 3 తులాలు కరక్కాయలు 2 తులాలు, వస 3తులాలు అల్లము 1 తులము కలిపి మెత్తగానూరి శేరు గోరువెచ్చని నీటిలో కలిపి ఈయుము.

లేక వెదురుప్పు 3 తులాలు సోడాపుప్పు 2 తులాలు, వాము పువ్వు 1 తులము, కర్పూరం తులము కలిపి తగినంత సారాయిలో కలిపి ఈయుము.

లేక మారేడు ఆకులు 4 తులాలు, కరిగొట్టుచెట్టు వేళ్ళు 3 తులాలు త్రిఫలాలు ఆరుతులాలు తెచ్చి మెత్తగానూరి శేరున్నర నీటిలోవేసి కాచి వడపోసి అందులో మరల ఒకతులము కర్పూరం కలిపి తగ్గువరకు మూడునాలుగు మోతాదులు ఈయాలి.

లేక నిమ్మనూనె 5 తులాలు, కర్పూరం ఒకతులము, వాం పువ్వు అరతులం కలిపి అర్థశేరు నీటిలో కలిపి ఈయాలి.

## ఉబ్బసము

పంచమూల కషాయము అర్థశేరు, జటామాంసి 2 తులాలు కలిపి రోజు కొక మోతాదు వంతున వారంరోజులు త్రాగించుము.

లేక చెరుకురసం 8 తులాలు, బిల్లుడుగడ్డి 4 తులాలు, పైడితం గేడుచెక్కరసం 6 తులాలు జటామాంసి 3 తులాలు కలిపి శేరున్నర నీటిలోకలిపి కషాయముగాకాచి వడపోసి త్రాగించవలెను.

## గుండెజబ్బు

త్రికటుకాలు 2తులాలు, వెల్లుల్లి 2తులాలు వస1తులం,ఆవాలు 1తు, పిప్పిలి 2తులాలు ఉడకవేసి ముండ్లుతీసిన చేప 10 తులాలు,

తెలికపిండి అరవీసె కలిపి అర్థశేరు మేకపాలతోగాని, రెండు డ్రాములు సారాయితోగాని యియ్యాలి.

## వాతము

వాతముచే కాళ్ళు వాచియున్నయెడల వావిలి, తంగేడు, బారిజ దిరిశెన నిమ్మ ఆకుల పసర్లును, నెయ్యి మానెడు ఆముదము నూనె మానెడు కలిపి కాచి సగము శరీరమునకు రుద్ది తక్కినది లోపలికి త్రాగించిన యెడల వాతము తగ్గి వాపులు పోతాయి.

వావిలి, తక్కెడు, దుష్టుపాకు దిరిశెనవేళ్లు, బారిజచెక్క, తమలపాకులు, మోడి, ఇంగువ, తంగేడు, జిల్లేడుపువ్వులు, గన్నేరు వేళ్ళు, నల్లేరు, వాము, చేకొణశివేళ్లు, కాకరాకు సమాన భాగములు రోటిలోవేసి దంచి ముద్దలుచేసి ఆముదముతో కలిపి పెట్టిన వాతము తగ్గుతుంది.

ప్రత్తియాకు రసము, పుచ్చాకురసము, వావిలాకు రసము, అడ్డసరపాకు రసము, సంపెంగ రసము, తక్కెడాకు రసము, చింతాకు రసము, పల్లేరు రసము, తురకవేపాకు రసము, దిరిశెనాకు రసము, మారేడుపండ్ల ఊట, మేడిచెక్క రసము, నూనె, ఆముదము సమానముగా తీసి మిరియాలపొడ కలిపి పాకముగాచేసి పూటకు పావుశేరు పెట్టిన ఎటువంటి వాతములైనను తగ్గిపోతాయి.

## నక్కవాతము

పసుపు 6 తు, తామరదుంప 1 వీసె, బెండవేళ్ళు 2 గుప్పెళ్ళు, పంచదార అరవీశె కలిపి 2 సేర్లు పంచిసెతితో పాకముగావండి వెలగ కాయంత తీసికొని అర్థశేరు గొర్రెపాలతో కలిపి 15 దినములు పెట్టిన నక్కవాతము తగ్గుతుంది.

నిమ్మకాయంత రాతిసున్నము, పిప్పళ్లు 1 తు కలిపి ఉదయ సాయంకాలములందు 10 దినములు పెట్టిన నక్కవాతము నివారించుతుంది.

నాగులాకు 4 వీసెలు, తంగేడాకు 2వీసెలు, గోంగూర 8వీసెలు మంచినూనె 1 వీసెడుకలిపి ముద్దజేసి రేపూమాపూ మందువచ్చువరకు పెట్టిన నక్కవాతము నివారించుతుంది.

పచ్చిగోంగూర మణుగు, శొంఠి 10తు॥ మిరియాలు 6 తు॥ ఉసిరిపప్పు 7తు॥ కలిపి త్రొక్కి ఒకబానలో వేసి పెంటపోగుగోతిలో వేసి కలిపి యుంచి వారముదినములైన తర్వాత తీసి దినమునకొక వెలగ కాయంత ముద్దచేసి పెట్టిన పైవాతము నివారించును.

## తీ ట వా త ము

కలిసీసు అర్థశేరు బూరుగబంక 4 తులములు నువ్వుపువ్వులు నాలుగు గుప్పెళ్లు కలిపి పెట్టిన తీటవాతము తగ్గిపోతుంది.

గాడిదగడపాకు పసరు అర్థశేరు రాతిసున్నము గుప్పెడు నువ్వుల నూనె పావుశేరు కలిపి తీటకు పట్టించాలి.

మూరొక్కండాకు పసరు పావుశేరు గంధకము 1 తులము కలిపి రాసిన తగ్గును.

గోరింటాకుపసరు పావుశేరు పటికపొడి 1 తులము పొగాకు రసము పావుసేరు కలిపి రాసిన నివారించుతుంది.

కొబ్బరిచిప్పలు కాల్చి మసిచేసి ఆముదములో కలిపిరాసిన తీటవాతము నివారించుతుంది.

## శి రో వా త ము

అతివస 2 తులాలు, పిప్పలి 2తులాలు, వస 2తులాలు వావిలీ ఆకులుగుప్పెడు, ఉప్పు 4తులాలు, కలిపినూరి సారాయితో ఈయాలి.

లేక ఇప్పపువ్వు, మంచి గంధపుపొడి, తెల్లకలువ పువ్వులు ఏనుగ సహదేవి ఆకులు సమాన భాగాలు తీసికొని మెత్తగా నూరి ముచ్చిలిగుంటలో రుద్దవలెను. దీనినే పాలతో నూరి వడపోసి ముక్కు రంధ్రాలలో పోయాలి.

లేక ఆవాలు గుంటకలగర, నందివర్ధన కుక్కతులసి ఆకులు మెత్తగానూరి మంచినూనె కలిపి గోరువెచ్చగా కాచి వడపోసి ముచ్చిలిగుంటలో మర్ధనచేసి కొంత ముక్కు రంధ్రాలలో పోయాలి.

ఆవాలు ఒకటిన్నర తులము శొంఠి ఒకటిన్నర తులము హారతి కర్పూరం ఒకటిన్నరతులము గాలిమిడాకు పసరులో కలిపి చెవిలో పోయుము.

పరా:- వాతరోగములు వాని రోగనిదానములు చికిత్సలు వాతలు విపులముగా తెలిసికొన వలెననిన ఈ చింతామణిలో చూడుడు.

## కడుపుబ్బు

కాల్చిన మసి 12 తు, శేరు కలినీటిలో కలిపి త్రాగించిన కడుపుబ్బు తగ్గుతుంది.

వేరువజాముగ వేసిన పత్తులరెట్ట 6 తు, శేరు నీటిలో కలిపి త్రాగించాలి.

దిరిసెనాకు పసరు అర్ధశేరు ఉప్పు చేరెడు, బియ్యపుకలి అర్ధశేరు కలిపి త్రాగించాలి.

సైంధవలవణము 4 తు, వస 2 తు, కోస్టు 4 తు, వెర్రిపుచ్చ చెక్కరసము 6 తు కలిపిత్రొక్కి ఆముదముతో తడిచేసి తినిపించాలి.

కారింగువ 2 తు, కరిధూపము 1 తు గచ్చాకు రసము పావు శేరు ఉప్పు 4 తు, కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించాలి.

ఇంగువ 3 తు, వెల్లుల్లిపాయలు 4 తు, మంచిబెల్లము అర్ధశేరు కలిపిత్రాగించాలి. పైచికిత్సలన్నియు కడుపుబ్బుటకు మంచిపనిచేస్తాయి.

## విరేచనాలు

కర్పూరము ఒకటిన్నర తు, ఇంగువ 1తు, శొంఠి ఒకటిన్నర తు, బెల్లము తగినంత కట్టి నూకలజావతో రెండుపర్యాయము లిచ్చి రక్తవిరేచనములు కట్టుకుంటాయి.

కవిరి 1తు, సీమసున్నము ఒకటిన్నర తు, దాల్చినచెక్కపొడి ఒకటిన్నర తు, శొంఠి ఒకటిన్నర తు॥ కలిపి తినుఆహారములో రెండు వేళల పెట్టిన విరేచనములు కట్టుకొంటాయి.

కవిరి 1 తు॥ మాచికాయపొడి 1 1/2తు॥ నల్లమందు 1/4తు॥ సోపు 2 1/2 తు॥ రెండువేళల గంజిలోకలిపి పెట్టాలి.

ఉడుకబెట్టిన నీరుల్లిపాయలు 10 తు॥ కవిరి 1 తు॥ నల్లమందు 1/2 తు॥ కలిపి గంజితో ఈయాలి.

నల్లమందు పావుతులం కవిరి తు॥ సీమసున్నము 2 1/2 తు॥ శొంఠి 1 తు॥ కలిపి గంజిలో రెండువేళల ఈయాలి.

మారేడు గుజ్జుతో కవిరి రెండు మూడు పర్యాయము లీయాలి. పై చికిత్సలన్నియు విరేచనముల కట్టించుతాయి

## మలబద్ధకము

ముసాంబ్రిము ఒకటిన్నర తు॥ నేలవేము 1 తు॥ ఉప్పు రెండున్నర తు॥ శొంఠి ఒకటిన్నర తు॥ బెల్లము తగినంత కలిపి యిచ్చిన మలబద్ధకము నివారణవుతుంది.

కటకరోహిణి ముప్పావు తు॥ ఉప్పు రెండున్నర తు॥ శొంఠిపావు తులం॥ మిరియాలు ఒకటిన్నర తు॥ సారాయి 10 తు॥ నూకలజావ వేరె కలిపి త్రాగించాలి.

కారపుపాలు సేరువంతున రెండుపర్యాయములు త్రాగించాలి.

ఉప్పు చేరెడు. మోదుగవిత్తులు 1 తు॥ గోరు వెచ్చనినీరు శేరు కలిపి త్రాగించాలి. పై చికిత్సలన్నియు మలబద్ధకమును పోగొట్టు తాయి.

## అజీర్తి

కారము, ఆవపిండి, ఉప్పు కలిపి మూడు గొట్టములు పెట్టిన అజీర్తి, శూలనొప్పి నివారిస్తుంది.

చింతపండు పులుసు, కారము, ఉప్పు ఆవపిండి కలిపి పూటకు మూడు గొట్టములు పెట్టాలి.

మిరపాకురసము మిరియాలపొడి ఉప్పు నూరి కలితో పెట్టాలి.

వాము ఆవాలు కరిధూపము ఉప్పు పంచలవణములు ఇంగువ కలిలో కలిపి పెట్టిన శూలలన్నియు పోతాయి.

వాకుడుచెట్టు సమూలరసములో పంచలవణములు వెల్లుల్లి కలిలోకలిపి పెట్టుము. పై చికిత్సలన్నియు అజీర్తిశూలలు నివారించు తాయి.

## బలవర్ధకములు

వాత శరీరము కలిగి నునుపుగను బలిసినదిగను డొక్కలు దించు కొని ఎల్లప్పుడు కన్నుల వెంట నీరుగార్చుచు కాళ్లుపట్టివేయు ఎద్దులకు కల్లుబెల్లం వీశెడు మంచి నువ్వులనూనె అరవీశెడు కలిపి జత ఎద్దు లకు ఉదయం 10 గంటలకు పెట్టాలి. ఈ రీతిగా అయిదు వారములు పెట్టుచు పిల్లిపెసర తొండంగి మినపకాడ ప్రత్తివిత్తులు మొదలగునవి నిరాటంకముగా పెట్టవచ్చు.

అంత నిశ్శక్తి అంతవాతము లేకుండనుండుపశువునకు నిశ్శక్తిను వస్తువు లుపయోగించినప్పుడు నీరు మేత ఎక్కువగా సేవించుచు తెల్ల వారునప్పటికి నిర్జీవముగలదిగానుండి నిస్సత్తువతో నుంటుంది. అప్పుడు

యి తడికాగునకు కళాయి వేయించి అందులో మెట్టతమిధలు వేయించి ఒక ఇరస, కల్లుబెల్లము ఒకటిన్నర మణుగు మంచినూనె ఒకటిన్నర మణుగు వేసి కలిపి ఒకవారము నిలువయుంచి ప్రతిదినము అరవీసె పరిమాణము వంతున పైనచెప్పిన లక్షణములు గల ఎద్దునకు పెట్టినయెడల బాగుగా బలియును.

రత్నాపురి గుగ్గిలము వీసెడు, మంచినూనె వీసెడు, తాటిబెల్లం వీసెడు, గవ్వసాంబ్రాణి వీసెడు, తెచ్చి ముందు నూనెలో గుగ్గిలపు పొడి కొద్దికొద్దిగా కలుపుచుండాలి. లేనియెడల గడ్డకట్టును. అందులో తాటిబెల్లము కలిపి తరువాత సాంబ్రాణి డబ్బాలో వారము దినములుంచి తదుపరి వారము దినములు ఈ మందును జత యెద్దులకు పెట్టాలి. పైమందులో శేరుగాని అడ్డెడుగాని, మినపపిండి కలిపిపెటిన మిగుల మంచిది.

## కడుపులోని వాయువును పోగొట్టుట

సోపు 2తు॥ ఏలకులు 2తు॥ జీలకర్ర తులమున్నర శొంఠి, తులమున్నర కపిపి తిను ఆహారంలో పెట్టాలి.

ఇంగువ 2తు॥ కర్పూరతైలము 5తు॥ అవిశనూనె అర్థశేరుకలిపి త్రాగించాలి.

సారాయి 10తు॥ ఉప్పు 10తు॥ ఇంగువ 1తు॥ గోరువెచ్చని నీరు శేరున్నర కలిపి త్రాగించాలి.

ఏలకులు 2తు॥ లవంగాలు అరతులం శొంఠి తులమున్నర సోపు తు॥ జీలకర్ర తులమున్నర కలిపి దాణాలో పెట్టాలి.

దాల్చినచెక్కపొడి 1తు॥ శొంఠి తులమున్నర మిరియాలు1తు॥ సోపు 1 తు॥ తిను దాణాలో పెట్టాలి.

ధనియాలు నాలుగున్నరతు॥ సోపు ఒకటిన్నరతు॥జీలకర్ర 1తు॥ శొంఠి 1తు॥ వాముగిద్దెడు కలిపి తినుఆహారములో కలిపి పెట్టాలి.

మెంతులు 8తు॥ మిరియాలు తులమున్నర ఆవాలు 1తు॥ ఉప్పు గిద్దెడు కలిపి పెట్టాలి.

వెల్లుల్లి 4తు॥ ఇంగువ తులమున్నర ఉప్పు తులమున్నర శొంఠి 1తు॥ బెల్లపుసెటిలో కలిపి పెట్టాలి.

పిప్పళ్లు 1తు॥ శొంఠి 1తు॥ పసుపు తులమున్నర లవంగాలు తులమున్నర ఉప్పు రెండున్నరతులములు కలిపి పెట్టుము.

## మూత్ర రోగములు

నీరుల్లిపాయల రసమును నీరు చురుకునకు యిచ్చిన తగ్గుతుంది.

సూర్యక్షారమును నీటిలోకలిపియిచ్చిన నీరుచురుకు తగ్గుతుంది.

పెద్దనల్లేరు సమూలరసమును యిచ్చిన మూత్రకోశములోని నొప్పి, మంట, వేడి, శుక్లనష్టము తగ్గుతుంది.

ధనియాలచూర్ణమును గాని పచ్చికొతిమీర ఆకును గాని యిచ్చిన మూత్రమువెంట ఇంద్రియము పడుటను కట్టించుతుంది.

మంచిగంధమును లోపలికిచ్చిన వీర్యనష్టము తగ్గుతుంది.

వెంపలివేళ్ళ రసము కలినీటితో కలిపి ముక్కురంధ్రములలో పోయాలి.

తెలికపిండిని మోదుగనీరు కలితో కలిపి పెట్టాలి.

శొంఠి పిప్పళ్ళు మిరియాలు సమానభాగములు తీసికొని కలితో పెట్టిన దగ్గు పగర్పు కట్టును.

దిరిసెనాకు పసరు, తెల్లవావిలాకు పసరు, కలిపి ప్రతిదినము పెటుచుండినయెడల తగును.

నీరుల్లిపాయరసము అర్థశేరు మజ్జిగ అర్థశేరు కలిపి తాగించాలి.

రావిచెక్క రసము అర్థశేరు పచ్చిపాలు అర్థశేరు కలిపి నాలుగుదినములు తాగించాలి.

తెలికపిండి అరవీసె, ఆవుపాలు అర్ధశేరు, గంజి అర్ధశేరు, కలిపి త్రాగించాలి.

ప్రత్తికాయలు గుప్పెడు ఆవుపాలతో నూరి త్రాగించాలి.

మార్కాండాకు పసరు ఒక్కొక్క ముక్కురంధ్రములో 10 చుక్కలు వేయాలి.

## దగ్గు, జలుబు

ఇంగువ 6 తు॥ అల్లము 2 తు॥ కలిపి నూరి తినిపించాలి.

నీరుల్లిపాయలు దాహము పెట్టినట్లుగా తినుపించాలి.

అడ్డసరపాకు రసముతో తేనెకలిపి నాకించాలి.

ఇంగువ ఒకటిన్నర నవాసాగరము ఒకటిన్నర తు॥ కర్పూరము ఒకటిన్నర తు॥ యష్టిమధుకము 3/4 తు॥ బెల్లము తగినంత కలిపి నాకించాలి.

కర్పూరము యష్టిమధుకము ఒకటిన్నర తు॥ ఇంగువ 1 తు॥ తేనె తగినంత కలిపి అప్పుడప్పుడు నాలుకకు నాకించాలి.

కృష్ణతులసి ఆకులు అరగుప్పెడు, మిరియాలు అర తు॥ శొంఠి అరతులం, తమలపాకులు 6 కలిపి నూరి తేనెతో నాకించాలి.

## వగర్పు

వస, శొంఠి, పిప్పళ్ళు, పసుపు మిరియాలు ఒక్కొక్కటి పావు తులము వంతున నూరి ముక్కురంధ్రములలోనికి నశ్యముచేయించాలి.

అడ్డసరాకు పసరు మానెడు, శొంఠి 8 తు॥ పసుపు 3 తు॥ మిరియాలు 4 తు॥ కలిపి నూరి నాలుగుదినములు త్రాగించాలి.

కలినీరు పావుశేరు, వెంపలిఆకు రసము 3 తు॥ కలిపి ముక్కురంధ్రములలో పోయాలి.

మోదుగాకు పసరు అర్ధసేరు, తెలికపిండి సవాశేరు కలిపి త్రాగించాలి.

దుష్టుపాకు గుప్పెడు, దిరిశెనాకులు గుప్పెడు, పసుపు అరతులం నల్లేరు 3 తు॥ కలినీరు అర్థశేరు కలిపి త్రాగించాలి.

దుష్టుపాకు పసుపు ఆముదము కలిపి నండిపెట్టిన తగ్గును.

## జ్వరమును తగ్గించునవి

వసపొడి రెండున్నర తు॥ నేలవేము కషాయము రెండున్నరతు॥ వేడినీరు శేరున్నర కలిపి త్రాగించాలి.

నవాసాగరము ఒకటిన్నర తు॥ ఉప్పు 10 తులములు నీరు శేరు కలిపి త్రాగించాలి.

గచ్చపప్పు 1 తు॥ మిరియాలు 1 తు॥ లవంగాలు ఒకటిన్నరతు॥ కలిపి తిను ఆహారములో పెట్టాలి.

## కంటి పొరలకు

తెల్లగజ్జెరువేరు 4 తులాలు ఆవుపాలు 2 తులాలు కలిపి నూరి ఆయింటుమెంటుగా చేసి కొంచెము ఆరనిచ్చి కండ్ల పొరలకు అప్పుడప్పుడు పట్టించిన తగ్గును.

లేక ఆముదపు ఆకులరసం 1 తులం, ఉప్పు అరతులం కలిపి కంటిపువ్వులకు, ఎరుపులకు, పొరలకు పట్టించుము.

లేక మిరియాలపొడి అరతులం దొండాకు పసరు 3 తులాలు కలిపి పువ్వులకు పట్టించుము.

## రే జీ క టి

నందివర్ధనపువ్వులు 4, ఇప్పపువ్వులు 4, మంచిగంధపు పొడి 1 తులం కలిపి మెత్తగానూరి అప్పుడప్పుడు కండ్లలో పెట్టుము.

## రొమ్ము పట్టు

మంచి నడివయస్సులోనున్న అనగా మొదటిసారి గ్రుడ్లుకొరకు వచ్చిన పెట్టనొకటి, దాల్చినచెక్క 5 తు॥ ఏలకాయలు 2 తు॥ లవంగాలు 2 తు॥ దుంప పసుపుకొమ్ములు 5 తు॥ ధనియాలుపావుసేరు, అల్లము 5 తు॥ వాము సోలెడు, నువ్వులనూనె అరవీసె తెచ్చి సదరు వస్తువులన్నియు మెత్తగా కొట్టవలెను. కోడిబొచ్చు తీసి కాల్చి కాళ్ళ భాగములు తీసివేసి మిగిలినది రోటిలోవేసి మెత్తగా త్రొక్కి ఎముకలుతీసి అందులో పై చూర్ణమును నూనెలో కలిపి మెత్తగా దంచి ముద్దలుచేసి సాయంకాలము పెట్టవలెను. ఈ మందు పెట్టిన రాత్రి నీరు పెట్టరాదు. ఇట్లు చేసిన సమస్త వాతరోగములు హరించు తాయి. (అనుభవము)

నువ్వుపిండి; తాటిబెల్లము, ఉలవ కలిపి కోడిపెట్ట కొవ్వు సమానభాగములు రోటవేసి దంచి కోడిగ్రుడ్డంత రెండు వేళల పెట్టుము.

ఉప్పిచెక్క, పసుపు, ఉలవపిండి కలిపిపెట్టిన తగ్గును.

తాడిబెల్లము, జిల్లేడుపట్ట కలిపి దంచిపెట్టిన తగ్గును.

## అరుగ్రిపట్టు

పశువు ముక్కుకొననుండి తోక చివరవరకు త్రాడుతో కొలిచి ఆ త్రాడును చెరిసగముచేసి ఆ సగముతో దాని ముక్కుకొననుండి కొలువగా నది ముగిసెడి చోటునకు వాతవేసిన తగ్గును.

దొండాకు పసరు వెన్నతో కలిపి అరుగ్రిభాగమునకు మర్ధనచేసి తవుడు వేయించి కాపులు కాయాలి.

పంది చమురు అప్పుడప్పుడు రుద్దుచుండాలి.

ఆరంభములో వెన్ను భాగమును వెన్నతోరుద్ది చిన్న ఉల్లి పాయలు జిల్లేడాకులు పొట్లములుకట్టి ఆముదములో ముంచి కాకవేసి వెన్ను భాగమునకు కాపులు తియ్యవలెను.

## చెవిరోగములు

నిమ్మకాయ రసము 2 తు. గవ్వసున్నము అరతులము కలిపి చెవిలో పోయుము.

ఉత్తరేణి సమూలవు భస్మము కాల్చినపొడి 2 తులములు నూనె 4 తులములు కలిపి పోయుము.

వావింటాకు ఉప్పుతో దంచి రసముతీసి చెవిలో పోయుము.

గవ్వనుకాల్చి భస్మముచేసి నిమ్మరసముతో కలిపివేసిన తగ్గును.

## ఉండె తొలగుట

ఆముదపుపప్పు సోలెడు, రాతిసున్నము 16 తులములు తెచ్చి మెత్తగానూరి వుండెను సరిగాలాగి పట్టువేసి నాలుగు దినములుంచిన తగ్గును.

ఉండెను లాగి జారిన భాగముచుట్టు రక్షలు పెట్టుము.

శొంఠి 4 తులములు, పిప్పళ్ళు 1 తులము మిరియాలు 1 తులము ఉమ్మెత్తాకు పసరు అర్ధసేరు తేనె 4 తులములు కలిపి మర్ధించుము.

## కాలిన బొబ్బలు

గాడిదగడపాకు రసము రాచి పిడకబూడిద చల్లుము.

నవనీతము ఆరగా ఆరగా రాయుచుండుము.

తిప్పతీగె రసము పూయుము.

కొబ్బరినూనెలో సున్నపునీరు పోసి తరచిన వెన్నవలెనగును. దీనిని ఆరగా ఆరగా పూయుచుండుము.

పాతసున్నమును పెరుగుమీాదతేట కలిపి రాయుము.

గోరింతచెక్క కషాయము రాయుము.

నీలిమందును నీటిలో కలిపి రాయుము.

## పురుగులు పడిన పుండ్లు

బారిజపాకురసము గుప్పెడు, ఉప్పు 2 తులములు, మిరియాలు 1 తులము. తెచ్చి గుమ్మపాలతో నూరి పురుగులు పడిన పుండ్లకు పట్టించుము.

మిరియాలు 1 తులము సైంధవలవణము 1 తులము గాడిదగడ పాకుతో నూరి పుండ్లకు పట్టించుము.

ఆముదములో కొత్తరాతిసున్నమునూరి పుండ్లకు పట్టించుము.

పొగాకు, కరిధూపము. పొట్లాకు నూగు, రాతిసున్నము ఆనపాకు సమానభాగములుగానూరి గాయములకు పట్టించుము.

సీతాఫలపాకు గుప్పెడు, రాతిసున్నము 1 తు॥ చేర్చి నూరి పట్టించుము.

హారతికర్పూరము కరిధూపము చేర్చి పెట్టుము.

వస, కరిధూపము. సున్నమునూరి వేయవలెను.

## చేపుటకు

అడ్డసరపాకు 2 గుప్పెళ్లు ఉప్పు చేరెడు జీలకర్ర 1 తులము సుగంధపాలు 4 తులములునూరి అడ్డెడు మజ్జిగలో కలిపి త్రాగించాలి,

చేకొణితాకు 2 గుప్పెళ్లు తెల్లఆవాలు 1 తులము ఉప్పు చేరెడు పులిచల్ల అర్థశేరు కలిపి త్రాగించుము.

బంధము వేయనీయక పొడుచుచూ దూడను దగ్గరకు చేర నీయక గంతులు వేయుచుండు పశువు పొగుడునకు పుల్లతీగెరసము రాసిన చేపువచ్చి పాలను పిండుకొననిచ్చును.

పాలు యీయక తిప్పలు పెట్టు పశువునకు నెయ్యి పావుశేరు గోధుమగంజి అర్థశేరు గంజి శేరు కలిపి 4 దినములు పెట్టుము.

కనెర కోమలి తీగరసము పావుశేరు తెలికపిండి సవాశేరు కలిపి శరీరమునకు రాయుము.

## మ లి మి డి

ఆముదములో చిత్రిమూలపు పొడి కలిపి కట్టిన తగ్గును.

శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, చిత్రిమూలము కలిపి నూరి ఆముదముతో వండి గోరువెచ్చనిది కట్టవలెను.

దుష్టపు వేళ్ళు మిరియాలు నూరి రసముతీసి ముక్కులలో పిండుము.

గాలిమిడిఆకు మిరియాలు మెత్తగా నూరి నీరుడుతో వండికట్టిన తగ్గును.

ఆముదములో వామింటాకు త్రొక్కి పాకముచేసి కట్టవలెను.

బర్రెపేడలో, చెంచలిఆకు వండి కట్టిన తగ్గును.

## ఉ ం గి డి

పులికలిలో దుష్టపువేళ్ళు నూరి సారముతీసి ముక్కురంధ్రము లలో పోసి కన్నులకు ఇంగువ పెట్టిన తగ్గును.

నల్లేరు చిగుళ్ళు దవుడలలో పెట్టి కొరికించవలెను.

పులికలిలో ఉప్పు నల్లేరుకలిపి త్రొక్కి పెట్టవలెను.

కొమ్ములకు నూనెవత్తులుచుట్టి కాల్చి జాముసేపుంచిన తగ్గును.

కుంకుడుకాయ గంధము కన్నులకు పెట్టవలెను.

నిమ్మపండ్లరసము కలిపి మూడుగొట్టములు పెట్టవలెను.

చిర్రిచెట్టు దంచి రసముతీసి పులికలితో మూడుగొట్టములు త్రాగించాలి.

చింతపండుపులుసు మూడుగొట్టములు పెట్టిన తగ్గును.

దీపుకొడిచే జిల్లేడుపత్రి పొట్లములుగా కట్టి చమురును కాచి మూడునపెట్టిన తగ్గును.

## మా వి ప డు ట కు

తవ్వెడు నువ్వులుతొక్కి సేరునీటిలో కలిపి పెట్టుము.

పులిచల్లలో కందదుంపనూరి కలిపి పెట్టుము.

ఆముదము సవాశేరు త్రాగించుము.

సెనగలు నానబెట్టి పెట్టుము.

## మా వి తి ని న చో

అనుములు పావుశేరు, పచ్చిపుచ్చాకుపసరు అర్థశేరు, మజ్జిగ శేరు కలిపి త్రాగించాలి.

వాముర సము అర్థశేరు, ఉప్పు గిరెడు, ఆముదపుపప్పు గిద్దెడు శేరు బియ్యపునీటిలో కలిపి త్రాగించవలెను.

## చూ లు ని ల్చు ట కు

కరివేపాకు గుప్పెడు వరిబియ్యము గుప్పెడు కొర్రలు 2 గుప్పిళ్లు కలిపి నూరి 15 దినములు పెట్టుము.

వెలిగారము 4 తులములు మజ్జిగ శేరు కలిపి 2 దినములు త్రాగించుము.

## తో క సు సి మి రి

ఉప్పు 2 తులములు ఆవాలు అరతులము అల్లము 1 తులము కలబందపసరు పావుశేరు, పులికలి శేరు చేర్చి మూడుదినములు పెట్టుము.

పిచ్చికుసుమాకు పసరు 10 తులములు నీలిమందు 1 తులము చేర్చి నుసిమిరికి అప్పుడప్పుడు రాయుచుండుము.

## తోక గురుజు

తోకచివర నరికి నెయ్యికాచి వేడిగానున్నపుడు ముంచవలెను.
కుసుమఆకునూరి తోకచివర రాసిన వెంట్రుకలు వచ్చును.
అల్లము ఉప్పు పులిచల్లలో చేర్చి రాయుము.

అల్లము కలబందగుజ్జు ఆవపిండి మెత్తగానూరి పులిచల్లలో మరగనిచ్చి దినమునకు మూడుగొట్టములు పెట్టవలెను.

## దృష్టి దోషము

పశువునకు దృష్టిదోషము తగిలిన వెంటనే జొన్నలు వేపాకు ప్రత్తిగింజలు ఉప్పు తెచ్చి పశువునకు దిగతుడిచి నిప్పులో పోయుము. దృష్టిదోషము పోవుటకు తాళ్ళు వేయుటకూడ మంచిది.

## చర్మ రోగాలు

కుప్పింటాకురసము 5 తు॥ సున్నము 1తు॥ నిమ్మరసము ఒకటిన్నరతు॥ కలిపి నుసిమిరి తామర గజ్జికి రుద్దాలి.

కవిరిని తేనెతో కలిలి పుండ్లకు రాయాలి.

పొగాకుపొడి ఒకటిన్నర సీతాఫలపాకుపొడి 10 తు॥ కర్పూరము ఒకటిన్నర తు॥ కలిపి దుర్వాసన వేయుపుండ్లకు పట్టించుము.

నీలిమందు 1 తు॥ గంధకము 1 తు॥ వ్యాసులైను 4 తు॥ చర్మరోగములకు వాడాలి.

నువ్వులనూనె కిరోసినాయిల్ కలిసి రాయాలి.
గాడిదగడపాకుపొడి ఆముదముతో కలిపి రాయాలి.
కృష్ణతులసిఆకురసములో నిమ్మరసము కలిపిరాయాలి.

సహాదేవ పశువైద్య ఫార్మసీవారి మందులు వీటిని ప్రతిరైతు ప్రతిబ్లాకుడెవెలప్ మెంట్ తెప్పించుకోవాలి.

# లేహ్యములు

## జంతురక్షిణి ( అమరప్రభ )

పౌను డబ్బా రు. 3. న. పై. 50.

4 పెద్దపశువులకు – 5 చిన్నపశువులకు సరిపోతుంది.

జంతువులను రక్షించాలంటే శాస్త్రోక్తముగా తయారైన ఈ జంతురక్షిణినే వాడాలి. ప్రభుత్వపశువైద్యటీకాల మాదిరిగా ముందుగనే మంచిపశువులకు వాడిన అంటురోగాలను రానీయక సూక్ష్మజీవులను చంపుటకు నిరీక్షించుచుండును. పశువులకు వచ్చే పెద్దరోగము దొమ్మలు, గురక, జబ్బవాపుమున్నగురోగాలకు చక్కగా పనిచేస్తుంది. చూడిపశువులకు కూడ నిరభ్యంతరముగా వాడవచ్చును. రోగముసోకిన ప్రారంభదశలో ఈమందును వాడిన పనిచేస్తుంది. తరువాత యిచ్చిన ప్రయోజనములేదు. మందుయిచ్చినతరువాత సరసగా ఆపసువుముక్కునకు పంచె చముడగాని యూకలిప్టస్ ఆయిలును గాని కొద్దిగా రాసి నాలుగైదుదినాలు సాంబ్రాణి ధూపం వేస్తూవుండాలి. పెద్దరోగములో పారుడున్న యెడల ఫార్మసీబేల్ పౌడరును వాడాలి. గ్రామాలలో అంటురోగా లున్నవని అనుమానముగా వున్నపుడు ముందుగనే ఫార్మసీకి వ్రాసి తెప్పించుకోవాలి. పౌను, అరపౌను, మాత్రంపంపరు. రెండు పౌనులనుంచి ఎంతవరకైనా పంపుతారు. ఎక్కువపశువులకు కావలసినపుడు మీదగ్గర రైల్వేస్టేషన్ తెలుపాలి. లేనిచో పోస్టలులో పంపుటకు వీలులేదు. పైరోగాల నిదానాలు, చికిత్సలు కావలసినపుడు మీ పంచాయితిలోగాని, మీ గ్రామ రైతులదగ్గర నుండే అనుభవ పశువైద్యచింతామణి చూడండి. వివరాలన్నీ తేటతెల్లమగును.

## స్వర్ణాసవ

( సువర్ణాసవ )

రు. 3–50

దీనినే సువర్ణాసవ అంటారు. మనపశువులకువచ్చే గాలికుంటు నోటిగాలి, గాళ్ళుఅనే అంటురోగము వచ్చినపుడు రైతులు పశువు

లకు ప్రమాదము తాకపోయినను పనిపాటలు పాడగునని భయపడు తారు. అందుచేత ఈవ్యాధి గ్రామములో నున్నదని అనుమానమున్న పుడు ముందుగనే ఈసుపర్నాసనను తెప్పించుకొని మంచిపశువులకు వాడిన చక్కగా పనిచేయును. ఈరోగంలో కలిగేపుండ్లకు, కాగ్నెక్సు నుగాని, హిలాన్‌నుగాని చెర్నారినిగాని వాడాలి. ఒక్కొక్క పశువునకు 4నుంచి 6తులాలవరకు వాడవచ్చును.

## (కనక) క న కా స వ

(పౌనుడబ్బా) రు. 3-50

దీనినే "కనక"అంటారు. శ్వాసరోగాలను తగ్గించాలంటే కన కాన్నే వాడాద. గుండెవగర్పు, వాతవగర్పు సక్కవాతము లేక కసిమిరి దగ్గు, ముకుబంతి మున్నగురోగాలకు చక్కగా పనిచేస్తుంది. పూటకు 4నుంచి6తులాలవరకు నీరుల్లి రసముతో గాని అడ్డసరపాకు రసముతో గాని, జమ్మిఆకురసంతోగాని ఉదయ సాయంకాలమందుఈయాలి.దీర్ఘ ముగా బాధపడుచుండే రోగాలకు ఎక్కువదినాలువాడాలి. గాన ఫార్మసీ వారికి వ్రాసి వివరాలు తెలిసికోవాలి.

## అ ర్క ము లు

### వాతారి అరఖు (లికన్నియిజ్జు)

పౌను సీసా రు. 3-0-0.

ఇతర నకలు మందులకు మోసపోక ఫార్మసీవారి సీలున్న దానినే తెప్పించుకోవాలి. ప్రతి రైతు తన పశువునకు వాతము చేసినదనిఅనుట ఎల్లరకు తెలిసిన విషయమే. పిల్లిపెసర, తవుడు పొట్టు ధాన్యములు, కృత్రిమ పదార్థములు, అతిగా పెట్టుటవల్ల కాళ్ళు పట్టుట, కాళ్ళ కలకలు, కాళ్ళ వాపులు, జీర్ణరోగములు చూడి పశువుల ఈచుకొనిపోవుట, రేటీకటి, పాడిపశువులు వట్టిపోవుట మున్నగు రోగాలు సంభవించు చున్నవి. ఇంకను దూడలకు

అజీర్తిచేసినా, దూడల కడుపులో ఎలికపాములు, నులిపురుగులు ఉత్పత్తియైనా, పాడిపశువులు ఎగచేపుకొన్నా వాతారిని వాడిన వైద్యులతో నిమిత్తం లేకుండా చక్కగా పనిచేయును.

ఉదయ సాయంకాలములందు శేరు గోరువెచ్చనీటిలో ఈ వాతారిని 4నుంచి 6తులములవరకు కలిపి ఈయాలి. ఇంకను అవుసర మున్న అల్లపురసంతో కలిసి యీయవచ్చును.

## వాతాంకుశము

పౌను సీసా రు. 3-50

రాయలసీమ, నెల్లూరు, గుంటూరు, హైదరాబాదు ప్రాంతాలతో నున్న కొన్ని తాలూకాలలో దీర్ఘవాత రోగము దీర్ఘవాయు పట్లు అనురోగము పశువులకు సోకి బాధపడుట ఎల్లరకు తెలిసిన విషయమే ఆయా తాలూకాల సెలయేర్లు వూటబావులు, దిగుడుబావులు పారిశ్రామిక కేంద్రస్థలాలలో నుండే స్థలాలలో "ప్లోరాను" అను లవణపదార్థ ముత్పన్న మగుచున్నది యీ ప్రాంతాలలోనుండు నీటిని ఆఉప్పునీటితో కలిసియుండు పచ్చికను మట్టిని తినుటవల్ల యీవాత రోగములు కలుగుచున్నవి.

ఎద్దులకు, గేదెలకు, కోడెలకు యీవ్యాధిసోకి కీళ్ళనొప్పులు, కీళ్ళకలకలు కీళ్ళరోగములు కలిగి ఎముకలవాపు, పోటు, నొప్పి కలిగి జెబ్బలు వాలినటులనుండుట, కాలిగిట్టలు పెరుగుట, కాళ్లుపట్టుట అప్పుడప్పుడు తీవ్రజ్వరము, నల్లకప్పువేయుట మున్నగు లక్షణములుండి పశువులెంతో బాధపడుచున్నవి.

యీరోగమునకు మాఫార్మసీచేతయారుచేయబడినసువర్ణవాతాం కుశమను అర్కమును ఉదయమున వాతారిచూర్ణమును సాయంకాల మున వేళల ప్రకారము యీయాలి. దీర్ఘరోగమైన మందును

చాలకాలమువాడాలి. ఇంకనుసలహా కావలసిన మాఫార్మసీకి తెలుపు చుండాలి. కీళ్ళవాపులకు, నొప్పులకు ఫార్మసీవారి స్ప్రెయిన్ కిల్లరును రుద్దుచుండాలి.

## ప శు ర క్షా మృ త ము

పౌను సీసా రు. 3-50

**ఆపత్కాలములలో** ఏరోగమైనది తెలియక భయపడే సమయములో తమపశువులను రక్షించేది పశురక్షామృతమని గ్రహించాలి. అన్ని రకముల రోగాలకు దీనిని కడుపులోనికి యీయవచ్చును. ప్రమాదం చేయదు. వ్యాధి గుణాలనుతగ్గించితే తగ్గించుతుంది. లేదా ఏరోగమైనది తెలిపే గొప్పగుణం యీరక్షామృతం జంతు రక్షిణితో పాటు యీరక్షామృతంను దగ్గర వుంచుకోవాలి.

మోతాదు 4నుంచి 10తులాలవరకు.

## కా లా గ్ని

**పౌను సీసా రు. 3-50**

**ఇదియొక** విచిత్రమైన మందు. ఇతరరోగాలలో నిస్సత్తువుగా నున్నపుడు ఉష్ణముతగ్గి శరీరము చల్లబడినప్పుడు, ఉష్ణము తీవ్రముగా నుండి ఆయాసము కలిగినపుడు కాలాగ్నిని ప్రతి 4 గంటలకు 10తులాలమందును సేరు గోరువెచ్చని నీటిలో గుణము యిచ్చేవరకు కలిపి తాగించాలి.

## శూ ల కు ఠా ర్

పౌను సీసారు. 3 50

ఈ అర్కము ఆంగ్లేయ వైద్యులు వాడు అల్కలైన్ మిక్చర్ కంటె కూడా ఎక్కువగా పనిచేస్తుంది. ఎంతోమంది వాడిరి. జ్వరములకు, శూలరోగములకు, దీర్ఘవాతములకు చక్కగా పనిచేస్తుంది. **మోతాదు 4 నుంచి 6 తులములు.**

# చూర్ణములు

## వాతారి చూర్ణము

పౌను ప్యాకెటు రు. 3-0-0

ఈ చూర్ణములో శాస్త్రసమ్మతమగు ఓషధులు 24 వరకు కలిసినవి దీర్ఘవాత రోగములకు, మామూలు వాతములకు ఈ పొడి అద్భుతంగా పనిచేస్తుంది. ఎంతోమంది రైతులు ప్రసంసించిరి. ఈపొడిని పూటకు 6 తులాలు తీసుకొని తగినంత తాటిబెల్లంతోగాని, గోరు వెచ్చని నీటితోగాని యిచ్చిన అమోఘంగా పనిచేస్తుంది.

## పశు బలవర్ధని

పౌను ప్యాకెట్టు రు. 3-0-0

పశువులకు బలము కలిగించే దాణాలు పెట్టేటప్పుడు తప్పక ఈ పొడిని పూటకు 5 తులాలు కలిపి వాడిన నరములకు సత్తువనిచ్చుతుంది. ఎంత మేపినను నిస్సత్తువుగానుండే పశువులకు దాణాలోగాని బెల్లంలోగాని కలిపి యిచ్చిన చక్కగా పనిచేస్తుంది.

## పశుమిత్ర

పౌను ప్యాకెట్టు రు 3-0-0

కడుపునొప్పి, కడుపుబ్బు గర్భశూల, గర్భవాతము, తదితర శూలలకు 6 నుంచి 12 తులాల పొడిని కారపుపాలతోగాని, బెల్లంతో గాని, గోరువెచ్చని నీటితోగాని ఈయాలి.

## క్షీరోజన్

పౌను ప్యాకెట్టు రు. 3-0-0

పశువులు ఈనిన తరువాత పాలు పడనపుడు తక్కువగా యిచ్చుచున్నప్పుడుగాని, పాలశేప్లు నాలుకసెల, పొదుగు వాపులలోగాని,

## గ్లయిమాల్

(నవనీత)

అరపౌను రు. 3-0-0

జంతువుల శరీరము కాలినప్పుడు, ద్రావకములుపడి పొక్కినపుడు, చర్మము పగిలినపుడు ఈ నవనీతం అద్భుతంగా పనిచేస్తుంది.

## ఐ ఓ డి న్

(ఖురరక్ష)

పావుపౌను రు. 3-0-0

పశువుల డెక్కలు తెగినపుడు, డెక్కల అడుగుభాగము మెత్తబడి కుంటునప్పుడు, గుత్తివాపులకు, నొప్పులకు చక్కగా పనిచేస్తుంది. ఈ మందును రెండు పూటల మర్ధనచేయాలి. అవుసరమున్న వేడి కాపులు తీయాలి.

## అ భి త

(మానరక్షణి)

పావుపౌను రు. 3-0-0

మేయి కనబడగనే ఈ తైలమునురాసి, లోపలికి వ్రేలును వాడు చుండిన ముక్కుట తగ్గి లోపలికి ముడుచుకొని పోతుంది.

## గ దా రి

(వజ్రదంత)

సీసా రు. 1-8-0

దంతములు కదలినపుడు, చిగుళ్ళువాచి మేత తిననపుడు దీనిని అప్పుడప్పుడు పట్టించిన పనిచేస్తుంది.

## పశు నేత్రాంజనం

నెం. 1 రు. 1-8-0

నెం. 2 రు. 1-8-0

పశువులకువచ్చే కండ్ల ఎరుపు, రేజీకటి, పువ్వులు దుర్మాంస ములకు ఉభయ సాయంకాలములందు నాలుగైదు చుక్కలు వేయాలి. అంజనమైన కాటుకగా కండ్లలో పెట్టాలి.

## రా మా యి ల్

సీసా రు. 1-8-0

తుమ్ములు రానపుడు మొగబంతి, శిరోరోగములకు దీనిని కొన్ని చుక్కలు ముక్కులలో వేయాలి.

## కొ కొ ని న్

(చరణాయుధ)

సీసా వెల రు. 3-50

కోళ్ళకు వచ్చే కొక్కెర రోగమునకు ఆరంభములో ఒకటి రెండు మోతాదులు ఈయాలి. మంచి కోళ్ళకు ముందుగా వాడిన ఈ రోగము రానీయక నిలిపి వేస్తుంది.

## స్ప్రెయిన్ కిల్లర్

అరసౌను రు. 3-0-0

దీనినే బెణుకు తైలమందురు. ప్రతి రైతుయింటిలోను ఈమందు వుండాలి. కాలు రెల్లపోయినా, కాళ్లు పట్టుపట్టినా, చర్మము, వెన్ను బిగిసికొనిపోయినా, కల్లవాపులు, పరంపర వాపులు పుట్టిన వెంటనే ఈ తైలమును పదేపదేరుద్ది బాగుగా మర్దించి వేడికాపులు తీయుచున్న గారడివలె తగ్గుతుంది. ఇది అంబకేషన్‌లా పనిచేస్తుంది.

ఈపొడిని ప్రతిపూట 6 తులములు తీసికొని తగినంత బెల్లముతోగాని కుడితితోగాని. దాణాలోగాని ఈయాలి. ఇంకను పాలు ఎక్కువ కావలెనన్న సోలెడు ఉలవలు నానవేసి అందులో 8 తులాలు జీలకర్ర క్షీరోజన్ 4 తులములు కలిపి మెత్తగా రుబ్బి కుడితిగా పోయవచ్చును. ఇది ఎంతకాలము పెట్టినను యిబ్బందిలేదు. రైతుయొక్క ఆర్జనశక్తిని బట్టి వాడాలి. లేదా 3 పౌనులు శనగపిండి, 12 పౌనుల మెంతిపిండితో 1 పౌను క్షీరోజన్ కలిపి ప్రతిరోజు దాణాలోగాని. కుడితిలోగాని రెండుమూడు గుప్పెళ్ళు వేసిన పాలు వృద్ధి యగును.

## వి బ్రో

## గర్భరక్షక

అర పౌను ప్యాకెట్టు రు. 3-0-0

దీనినే గర్భరక్షక అందురు. పశువులు చూడిలో నున్నపుడు సరియగు పోషణ లేక బలహీనముగా నుండుట, లోపల పిండముకూడ వృద్ధిగాకుండుట, వాతము, మలబద్ధకము, రొంప మానము వెంట తెలుపు లేక ఎరుపు మైలపడుట ఆరవ నెలలో గాని నెలలుతక్కువగా ఈనుతుందని అనుమానముగా నున్నప్పుడు చూడిలోనే మేయి కనబడినపుడు పశువు కట్టి, వెంటనే చూలు నిలువనపుడు ఈ మందు చక్కగా పనిచేయును. వీటి వివరాలు ఫార్మసీవారికి తెలిపిన చక్కని సలహా లీయగలరు. యీ మందుతో పంచదార కలిపి యీయాలి.

## బేల్ పౌడరు (బిల్వ)

అరపౌను రు. 3-0-0

దీనిలో అభిని, బిల్వఫలాల చూర్ణం ఇంకను లవణ క్షార ములు కలియును. పశువులకు కలిగే ఎట్టి రోగములో వచ్చే విరేచన ములు రక్తవిరేచనములు మున్నగు రోగాలకు తగినంత నేరేడు లేక తుమ్మచెక్కతో శాస్త్ర సమ్మతముగా కాచిన కషాయముతో

4 నుంచి 10 తులాలవరకు వ్యాధియొక్క ఉద్ధృతనుబట్టి ఈయాలి. ఎక్కువ, తక్కువలుగా ఉపయోగించక జాగ్రత్తగల మోతాదులు ఈయాలి.

## గర్భక (గర్భధారి)

అరపౌను రు. 3-0-0

వంధ్య పశువులకు ఈ మందును మండలము రోజులు వాడిన తప్పక చూడియగును. సలహాకొరకు ఫార్మసీకి వ్రాయాలి.

## సాన్టాల్ (వర్ధిని)

అరపౌను రు. 3-0-0

మూత్రరోగాలకు మురిపెమైన దివ్యౌషధము రక్తమూత్రము నీరుచురుకు, మూత్రశూల శుక్లనష్టంలకు పనిచేయును. శిలామేహ వాతం ప్రారంభదశలో పనిచేస్తుంది. వృచ్చబుడ్డబద్ధలై కండ్లు పీకుకొని పోయినపుడు ఈ మందును వాడనేవద్దు ఈ చూర్ణమును ప్రతినాలుగు గంటలకు రక్తమూత్రము పోయుచున్నచో 6 తులాల చూర్ణంలో అరతులం పటికపొడి కలిపి తగ్గేవరకు ఈయాలి.

శుక్లనష్టంలో రావి లేతచిగుళ్ళలో ఈ పొడిని 4 తులాలు కలిపి వరుసగా వారమురోజులు రోజుకొక మోతాదు ఈయాలి.

## విషఘ్ని

అరపౌను రు. 3-0-0

పిచ్చి కుక్కలు, నక్కలు, విషపు సాలీళ్ళు చికుకప్పలు ఉంగిడి మున్నగు రోగాలకు పనిచేస్తుంది. మోతాదు 4 నుంచి 8 తులాలు.

## ఉల్బం (చూర్ణం)

అరపౌను రు. 3-0-0

పశువు ఈనిన తరువాత మైల తీవ్రముగా పడుచున్నప్పుడు మేయి నచ్చునప్పుడు, మావి పడనప్పుడు, ఈ చూర్ణమును వాడాలి. మావి పడనప్పుడు సేరు నువ్వులు త్రొక్కి 10 తులాల ఉల్బంను కలిపి సేరు గోరువెచ్చని నీటితో ఒకపర్యాయం యీయాలి.

చెర్మారి (పామారి)

పౌను రు. 3-0-0

దీనినే పుండ్లపొడి అంటారు. అన్ని రకాల గాయములకు పుండ్లకు యీపొడిని అవసరమునుబట్టి పట్టించిన పుండ్లు త్వరలో గారపట్టును. పుండ్లలోనున్న రసిని తగ్గించుతుంది. కాకులుకూడ యీపొడి ఘాటుకు పుండ్లను ముట్టుకొనవు.

అశ్వబలవర్ధని పౌను రు. 3-8-0

గుఱ్ఱములను బలిపించుటకు, నరాల పటుత్వమునకు వగర్పు రాకుండుటకు ప్రతి దినము నాలుగు తులాల పొడని తగినంత బెల్లంతో గాని, దాణాలోగాని కలిపి పెట్టిన చక్కగా పనిచేస్తుంది

# తైలములు

కార్నెక్సు (వ్రణఘ్నం)

పావు పౌను సీసా రు. 3-0-0

మానని మొండి గాయములకు, కొమ్ములు విరిగిన పుండ్లకు, మాద పుండ్లకు యీ మందు చక్కగా పనిచేయును. ప్రతి రైతుయింట ఇదియున్న డాక్టర్లక్కర లేదు.

కీటారి

పావుపౌను రు. 3-0-0

తోకనుసిమిరి, మొండి చర్మపుండ్లు, నుసిమిరి మున్నగు రోగాలకు యీమందు పెట్టిందిపేరు. యీరోగమున్న శరీరాన్ని కడిగి రెండుమూడు పూతలు పెట్టాలి.

హిలాను (శీతల)

పావుపౌను రు. 3-0-0

అన్ని రకములపుండ్లను మాన్పుతుంది. చర్మాన్ని బాగుచేస్తుంది.

అనోడైను (సుకర్ణ)

పావుపౌను రు. 3-0-0

అన్ని రకముల చెవి రోగాలకు పనిచేస్తుంది. ప్రతిరోజు చెవిని కడిగి కొన్ని చుక్కలు వేస్తుండాలి.

## ధ ౯ ధ ౯ (లావణ్య)

పావు పౌను రు. 2-50

పెద్ద పశువులు, చిన్న దూడలు తమ మూత్రము తామే త్రాగుతూవుంటే నాలుగుగంటల కొకసారి యీలావణ్య అనగాకొన్ని లవణాలతో తయారుచేసిన యీమందును నాలుకకు, ఖొడ్డునకు రాసిన మరల ముట్టుకోవు.

## కం డూ తృ

(దద్రునాశ)

అరపౌను రు. 3-0-0

గోమారులు, మిన్నల్లులు పేలువున్న పశువులకు ఒకటి రెండు పర్యాయములు పట్టించిన చక్కగా పనిచేస్తుంది.

## కుక్కల మందులు

### కుక్కల టానిక్

ఈ టానిక్‌ను రోజుకు రెండు గరిటెలు కుక్కలు త్రాగు పాలలో విడిగాగాని, ఆహారంలోగాని కలిపిపెట్టిన మంచి బలమురోగాలు రావు.

వెల రు. 3-8-0

### కుక్కలడిస్టెంపర్ రోగ నివారిణి

కుక్కలకు యీ డిస్టెంపర్ అను వ్యాధి భయంకరమైనది. ఈ వ్యాధి వచ్చిన కుక్కలు బ్రతుకుట కష్టము. కావున ముందుగనే డిస్టెంపర్‌రోగ నివారిణిని మీ కుక్కలకు ఒక ఔన్సు త్రాగించిన దాని జీవితకాలమంతా యీ వ్యాధిరాదు. ఇది ఔన్సు సీసాలో వుండును.

వెల రు. 15-0-0

### కుక్కల గ్రైప్‌వాటర్

కుక్కలకు, కుక్కపిల్లలకు ఈ గ్రైప్‌వాటర్ రోజు ఔన్సు త్రాగించిన చాలమంచిది.

వెల రు. 2-8-0

## కోళ్ళమందులు

### కోవెనిన్

కోళ్ళకు అంటురోగాలు సోకకుండా కాపాడును. వారానికొక సారిగాని రెండుసార్లుగాని ఒక్కొక్క కోడికి 4 చుక్కలు త్రాగించవలెను.

### వాతారి అర్కము

కోళ్ళకు కలుగు జీర్ణరోగాలు, వాతరోగాలకు పనిచేయును. వారానికొక సారి ప్రతి కోడికి ఆరుచుక్కలు త్రాగించిన వాత, జీర్ణరోగాలు సోకవు.

వెల రు. 3-0-0

### కోళ్ళ టానిక్

కోళ్లు తినుదానిలో రోజు గరిటెడు మందును కలిపిపెట్టిన మంచి బలము. గ్రుడ్లు బాగా పెట్టును.

వెల రు. 3-8-0

## గుఱ్ఱాల మందులు

### అశ్వబలవర్థిని

యీ మందును రోజు ఔన్సు గుర్రాలుతిను దానిలో పెట్టిన మంచి బలము. వాత, జీర్ణరోగాలు సోకవు.

వెల రు. 3-8_0

### వాతారిపొడి

యీ వాతారిపొడిని 2 ఔన్సులు తీసుకొని కడుపుబ్బు, కడుపు నొప్పి, వాతం చేసేవాటికి గోరువెచ్చని నీటిలో యిచ్చిన చక్కగా పని చేయును. వెల రు. 3-0-0

### ఆఫ్రికన్ గుర్రపుజబ్బు

యీ జబ్బు అంటురోగము. యీ రోగనివారణకు ఆఫ్రికన్ గుర్రపు జబ్బు నివారిణిని 4 ఔన్సులు ముందుగనే తినిపించిన దాని జీవిత కాలమంత వ్యాధిరాదు. వెల రు. 5-0-0

## గొర్రెల మేకల మందులు

### జంతు రక్షణి

గొర్రెలకు, మేకలకు కలుగు దొమ్మ, ఊలతెగులు మొదలైన అంటురోగాలు గ్రామాలలో వున్నవనగానే మంచిజీవాలకు ఒక్కొక్క దానికి 2 ఔన్సులు జంతురక్షణిని తినిపించిన వ్యాధులు సోకవు.

వెల రు. 3-0-0

### వాతారి అర్కము

కడుపుబ్బు, కడుపునొప్పి, అజీర్తి మొదలైన జీర్ణరోగాలు, వాత రోగాలకు పనిచేయును. మోతాదు 2 ఔన్సుల మందు అర్థశేరు గోరువెచ్చని నీరు. వెల రు, 3-0-0

మీ పశువులకు, కుక్కలకు, గొర్రెలకు, మేకలకు, గుర్రాలకు కలుగు వ్యాధులు వాటి లక్షణాలు స్పష్టంగా తెలియపరస్తూ మాకు జాబురాసిన సలహాలు, మందులు పంపి తోడ్పడుతాము. కావున యీ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటారని ఆశించుతాం.

సహదేవ పశువైద్య ఫార్మసీ
మారీసుపేట, – తెనాలి.

### పశువైద్య గ్రంథాలు

| | |
|---|---|
| అనుభవ పశువైద్య చింతామణి | 12-0-0 |
| ప్రాచీన పశు సంజీవి | 2-0-0 |
| కోళ్ళ పరిశ్రమ | 3-0-0 |
| పశు విజ్ఞాన శాస్త్రము | 4-0-0 |
| పశువైద్య ఇంజెక్షన్ గైడ్ | 2-0-0 |
| అనుభవ వృషభ పరీక్షాబోధిని | 2-0-0 |

యీ గ్రంథాలు మావద్ద దొరకును.

సహదేవ పశు ద్య ఫార్మసీ
మారీసుపేట, – తెనాలి.

……(o)……

# ప్రభుత్వ అనుమతి జీ.వో.లు

## అనుభవ పశువైద్య చింతామణి

పంచాయతీబోర్డులు, సహకార సంఘములు, బ్లాకు డెవలప్‌మెంట్సు, ప్రభుత్వ జీ. వో. ల, సర్క్యులర్సు ప్రకారము అనుభవ పశువైద్యచింతామణిని తెప్పించుకోవచ్చునుగాన తప్పక ఈ గ్రంథాన్ని ఆయా సంస్థలలోనుంచి పశుసేవ చేయించకోరుతాను.

## పంచాయతీ బోర్డులు

లోకల్ బోర్డ్సు జీ. వో. నెం. **3958**

## సహకార సంఘములు

పాలసప్లయి సొసైటీలు - పశు పెంపకపు సంఘములు స్పెషల్ డెవలప్‌మెంటు ఆఫీసర్లు, అన్నిరకాల కో-ఆపరేటివ్ సంఘములకు ప్రభుత్వ సర్క్యులర్ నెం. **120677**

## బ్లాకు డెవలప్‌మెంట్సు

ప్రభుత్వ మెమోరాండం నెం. **16630/57-2**



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA102B121 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 613 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI ,D,IV |
| లేని పేజీలు | VII-X |
| తయారు చేసినది | thasin |
| పేజీలు విడదీసినది | Bhanusree |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యునిది | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |